పడుటయును, వ్యవసాయదారులు కష్టపడుటయును తెలిసినవిషయము. ఉద్యోగస్థులు స్వల్పజీతమును గడించినను రయితులకంటెను మంచిస్థితియందున్నారని స్టోక్సుగారును నంగీకరింపవలయును. జీతములను తగ్గింపగోరుట ఓర్వలేమితనము కాజాలదు. మూలధనవ్యయమునందు మెట్టూరు, కట్టలై ప్రాజెక్టులందు వ్యయమును తగ్గించుటకు గల యవకాశములను స్టోక్సుగారు పూర్తిగా వినియోగింపలేదు. క్రొత్త ప్రాజెక్టుల విషయమై స్టోక్సుగారు గలుగజేసిన భ్రమయును నిరుపయోగము. తుంగభద్ర భవానిప్రాజెక్టులకు ప్రభుత్వము అప్పు చేయుట న్యాయము కాని ఆదాయమునుండి వ్యయముచేయుట న్యాయము గాదు. వర్తమానార్థికదుర్దశయందు రయితుల కేవిధమైన యుపకృతిని కల్పించుట రాష్ట్రీయప్రభుత్వములకు సాధ్యముకాదని స్టోక్సుగారు తెలిపిన నిరాశ విశ్వసనీయము కాదు. బొంబాయి నైజాము ప్రభుత్వములు కల్పించిన రిమిషనులును, ప్రపంచమునందంతటను ధరలను పెంచుటకు జరుగుచున్న ప్రయత్నములును నాశాజనకములు కాని నిరాశాజనకములు కావు. భూములులేని కూలివారును, చిన్న దుకాణదారులును వారియోగక్షేమములకు వ్యవసాయదారునిమీదను నాధారపడియున్నారు. వోటులున్న వ్యవసాయదారులకే కాక వోటులేని వ్యవసాయదారులకును, కూలివారికిని, దుకాణదారులకును రయితుల యోగక్షేమమే మూలాధారము. కానున్న రాష్ట్రీయస్వాతంత్ర్యముపేరను శాసనసభ్యలను భ్రమపెట్టుట నిరంకుశాధికారులకు పరిపాటియైనది. రయితుల యోగక్షేమము లేని రాజ్యాంగసంస్కరణములును, రాష్ట్రీయస్వపరిపాలనమును నిరుపయోగములే కాకను దుర్లభములు. మంత్రులును, రాజ్యాంగములును ప్రజాక్షేమమున కేర్పడును గాని ప్రజలు మంత్రులకును రాజ్యాంగములకు నేర్పడరు. ప్రభుత్వము పాఠశాలలకు, నూతులకు, రోడ్లకు, వైద్యసహాయమునకు, పశువులకును చేయుచున్న యుపకృతి విషయమై స్టోక్సుగారు చేసికొనిన స్వోత్కర్షయందలి సత్యాసత్యములను, వ్యవసాయము లేని భూస్వాములను చేసిన పరిహాసమునందలి యథార్థమును, స్టోక్సుగారు స్వయముగను గ్రామస్థులవలన తెలిసికొని ప్రకటించుట భావ్యమై యుండును.

ప్రపంచవ్యాప్తమైన మహాపరివర్తనేతిహాసములందు హిందూస్థానేతిహాసము లాదిపర్వమునందే యున్నవిధమును వ్యవహారజ్ఞులు గ్రహింపగలరు. శాసనసభలు, నిత్యవ్యవహారములు ప్రజ్ఞావాదములకు వినియోగపడునటులు యోగాభ్యాసమునకు వినియోగపడకున్నవి. సాంఘికసమరములు, పక్షవిభేదములు పారతంత్ర్య ప్రభావమును సకలవ్యవస్థలయందును ప్రత్యక్షము చేయుచున్నను మహానుభావుల సంకల్పాచరణములకు, సంకల్పసిద్ధికి సాధనములుగ నున్నవి.

గాంధిమహాత్ముఁడుహరిజనయాత్రయందవలంబించిన యోగాభ్యాస మితరవ్యవహారములందును ప్రజలకు సాధనముగ నుండగలదు. ప్రజాస్వామికమున కాటపట్టులైనరాజ్యములందు నిరంకుశదేవత ప్రళయతాండవమును జేయుచున్నపుడు సకల వ్యవహారములందును పారతంత్ర్యము ననుభవించుచున్న భారతవర్షము సమకూర్పగల భారము యోగారూఢులైన నాయకులమీఁదను గలదు. ముప్పదియైదు కోట్ల ప్రజలకును ప్రాచీన నవీనసంస్కారములకును నాకరమైన భరతవర్షమునం దుద్యోగపర్వనిర్వహణమునకై పరమేశ్వరుడు శ్రీ కృష్ణార్జునులను ప్రసాదించుగాత!

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras
Editor: G. Subbaramayya.